

## గాంధీ సంచిక



# వైశ్యప్రబోధిని

తెలుగు మాసపత్రిక

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

**2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ – 518 543 (కర్నూలు జిల్లా)**

సంప్రదించ వలసిన అడ్రసు :

**6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్**

**హైద్రాబాదు – 500 004.** ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పై బడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

**నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి** — ఆధ్యక్షులు

**మేడా నరసింహులు శ్రేష్ఠి** — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య
# నిత్య అన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం స్థాపితం : 1961 బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం
✆ : 52262 ప్రకాశం జిల్లా. ✆ : 87158 (S.T.D. 08524) కర్నూలు జిల్లా.

అతి పవిత్రమైన జ్యోతిర్లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కానర్ డ్యామ్, ప్రక్కనేయున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడుచున్నందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63న తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం. దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 109 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకు జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు :</u> ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకుల "18×15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫోటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క, జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతియొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిననుసహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించు చున్నాము.

పోలిశెట్టి సత్యనారాయణ యక్కలి బాలరత్నం
అధ్యక్షులు మరియు కార్యవర్గ సభ్యులు ప్రధాన కార్యదర్శి

# వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)



**స్థాపితము**

**1969**



**సంపుటి**

**28**



**సంచిక**

**2**



**అక్టోబరు - 1996**



సంపాదకులు :

'సంఘోద్ధారక'

'వైశ్యభూషణ'

పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :

వైశ్య ప్రబోధినీ

కార్యాలయం

"వాసవీ భవన్"

జయనగర్ కాలనీ,

కడప - 516 002.

ఫోన్ : 25025,

24911


సంపాదకీయం

## సరిక్రొత్తగా వ్రాయండి - అధికారులూ అంతవరకూ ఆగండి.

**ఏ** ప్రభుత్వమైనా కానీ - అది కేంద్ర ప్రభుత్వమైనా, రాష్ట్ర ప్రభుత్వమైనా చట్టాలను చేయడములో ఎంతో జాగ్రత్తగా ఆలోచించి వ్యవహరించాలి. అమ్మకం పన్ను మొదలగు పన్నులకు సంబంధించిన శాసనాల విషయములో ఈ జాగ్రత్త మరింత అవసరము. ఆ జాగ్రత్తతో బాటు ముందు చూపు కూడ ఆ ప్రభుత్వానికి ఉండాలి.

పై రెండూ లోపించినందుననే - ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వము గత జూలై నెలలో విడుదల చేసిన అత్యవసరాదేశము (ఆర్డినెన్సు) ఈనాడు ఇంతగా ప్రజల ఆగ్రహానికి, అసంతృప్తికి గురి కావడం.

గత ఆగస్టు నెల 1వ తారీఖు నుండీ అమలులోకి వచ్చునట్లుగా జారీ అయిన ఈ ఆర్డినెన్సు ద్వారా మన రాష్ట్ర ప్రభుత్వం ఎంట్రీ ట్యాక్సునూ, టర్నోవర్ ట్యాక్సునూ - తిరిగి రాష్ట్రములో ప్రవేశపెట్టింది. "ఈ రెండు - పన్నుల విధింపునూ రాష్ట్రములోని వర్తక సంఘాలు యావత్తు వ్యతిరేకిస్తున్నాయి. పై రెండు - పన్నుల విధింపునూ రాష్ట్ర ప్రభుత్వం ఉపసంహరించు కొను నంత వరకూ తన వ్యతిరేకతను కొనసాగించాలని నిర్ణయించు కొన్నట్లుగా, ఆయా వర్తక సంఘాల ప్రతినిధులు ఇస్తున్న ప్రకటనలు తేటతెల్లం చేస్తున్నాయి.

ఈ ఆర్డినెన్సు ద్వారా తిరిగి ప్రవేశ పెట్టిన ఎంట్రీ ట్యాక్సునూ, చేనేత వస్త్రాలపై విధించిన అమ్మకం పన్నునూ, ఉపసంహరించుకొనుటకు ముఖ్యమంత్రి మౌఖికంగా అంగీకరించినట్లూ, ఉప ఎన్నికలు ముగిసిన వెంటనే వాటి ఉపసంహరణ ఉత్తర్వును జారీ చేయనున్నట్లుగా కూడ కొన్ని వార్తలు అందుచూ ఉన్నాయి.

సర్వ వర్తక సంఘాలలో ప్రకటితమౌతున్న వ్యతిరేకతను బట్టి సదరు ఆర్డినెన్సు ద్వారా ప్రవేశపెట్టిన టర్నోవర్ ట్యాక్సును కూడ ఉపసంహరించడం కానీ లేక పూర్తిగా ఉపసంహరించక పోయినా కొంత మినహాయింపు ఇవ్వడం గానీ తప్పదు అనే తోస్తూంది.

టర్నోవర్ ట్యాక్సు విధింపే గందరగోళంగా ఉంది. గతములో ఉన్న టర్నోవర్ ట్యాక్సు విధింపు చాలా స్పష్టంగా ఉండేది. ఇప్పటి విధింపు తీరును చూచినపుడు నిర్వచనకు స్పష్టంగా లేకపోగా ఆచరణలో అధికారుల వల్ల ఆ పన్ను వర్తించు వర్తకులకు అనేక ఇబ్బందులు కలుగు అవకాశాలున్నవి. రాష్ట్ర ప్రభుత్వం పూర్తిగా మినహాయించక ఏదో కొంత ఊరడింపును ఇవ్వదలపెట్టినా, ఈ పన్ను విధింపు తీరును సమగ్రంగా పరిశీలించి, ఆచరణకు అనుకూలంగా సరిక్రొత్త ఉత్తర్వును జారీ చేయడం అవసరం

రాష్ట్రములో ఆగస్టుకు పూర్వముగల వృత్తిపన్ను చట్టాన్ని సవరిస్తూ సదరు ఆర్డినెన్సు ద్వారా సరిక్రొత్తగా వృత్తి పన్ను విధించు తీరును ప్రభుత్వం ప్రకటించింది. ఈ విధింపు తలకు మించిన భారము అనుటలో సందేహము లేదు. అందుకే ఈ పన్ను విధింపు పరిధికి వచ్చే ప్రభుత్వ, ప్రభుత్వేతర ఉద్యోగులు, వర్తకులు కూడ తమ అసమ్మతిని, ఆగ్రహాన్ని బాహాటంగా ప్రకటిస్తున్నారు.

ఈ ఆర్డినెన్సు లోని ఎంట్రీ ట్యాక్సు, టర్నోవర్ ట్యాక్సు, వృత్తి పన్ను విధింపూ, కొన్ని వస్తువులపై పెంచిన అమ్మకంపన్ను శాతమూ కూడ ప్రజల్లో ప్రభుత్వముపై అసంతృప్తిని కలిగించుటకు దారితీస్తూంది.

ఉప ఎన్నికల్లో ఎదుటి పక్షాలు, ఈ ఆర్డినెన్సులోని అంశాలనూ, ప్రభుత్వము రైతులకు విద్యుశ్చక్తిని ఇచ్చుటకు విధించిన ధరావతులు, పెంచిన విద్యుశ్చక్తి రేట్లనూ మరీ - మరీ ప్రజలకు చెప్పి తద్వారా కొంత ప్రయోజనాన్ని కూడ పొందే అవకాశాలే ఎక్కువగా ఉన్నట్లు, ఈ సంపాదకీయం వ్రాసే సమయానికి వెలువడ్డ పత్రికా వార్తలు చెప్పచున్నాయి.

అంతే కాదు. అనేక రకాల మినహాయింపులు ఇవ్వడం వల్ల ఈ అత్యవసరాదేశం యొక్క మౌలిక రూపం పూర్తిగా మారిపోయింది. అందువల్ల ఈ ఆదేశంపైన్నే మినహాయింపులు ఇచ్చేందుకు బదులుగా ప్రభుత్వం ప్రజల-వర్తకుల మద్దతును పొందుటకు వీలగు సరిక్రొత్త మార్పులతో సరిక్రొత్త ప్రభుత్వ ఆదేశాన్ని విడుదల చేయడం అవసరం.

అధికారులు కూడ ఈ అత్యవసరాదేశాన్ని తొందరపడి అమలులో పెట్టుటకు ప్రయత్నించక - కొంత నిదానించి, ప్రభుత్వం చేయనున్న సవరణలు పూర్తిగా వెలువడిన తర్వాతే పన్నులను వసూలు చేయాలి.

# మహాప్రస్థానము

- కరుణశ్రీ

ఏ మహాత్ము ప్రేమహృదయ ముప్పొంగెనో
కరుణవారిరాశి గట్లుతెగెనొ!!
పొర్లిపొరలుచుండె బిర్లాగృహమునుండి
జమునవైపునకు ప్రజాస్రవంతి!!

రత్నశిఖరి మీఁది రాయంచయే కాదు
చెట్టుమీది పరిగపిట్టకూడ
వెక్కివెక్కి యేడ్చె వేఁడి బాష్పాలతో
సాగిపోవు బాపు శవము గాంచి.

శాంత్యహింస లనెడు శస్త్రాస్త్రములు దాల్చి
సత్య కవచ మొడల సంతరించి
దండు నడిపినట్టి దండి సత్యాగ్రహి
కదలుచుండె శాంతి సదనమునకు!!

ఆగ్రహము లేదు - కలది సత్యాగ్రహంబె!
ఏ గృహము లేదు - కలది కారాగృహంబె!
దేశమున కెల్ల సత్య సందేశ మతఁడు -
లోకమున కెల్ల నవనవాలోక మతడు -

సత్యసహకారమున కహింసా లతా మ
తల్లికను మెల్లమెల్లఁగా నల్లువెట్టి
పూలు పూయించి తేనెలు జాలువార్చు
కర్మచంద్రుఁడు మన కింకఁ గానరాఁడు!!

నయనములు మూసికొని బోసినవ్వుబాబు
తల్లి ప్రక్కను నాఁ డొత్తిగిల్లె నట్లు!!
నయనములు మూసికొని యమునానదీమ
తల్లి ప్రక్కను నేఁ డొత్తిగిల్లె నిట్లు!!

బాపు-ప్రియబాపు-భారత పారతంత్ర్య
బంధములు బాపు మా ప్రియ బాపు-నేఁడు
పాంచభౌతిక దేహ మర్పించుచుండె
కొడుకు లంటించు నీ యగ్నికుండమందు!!

నెత్తురులు చింద తన మొండి కత్తితోడ
దేశమును చీల్చె నా 'ఖాయిదే అజాము'
మంచిగందపుచెక్కల మధ్యనేఁడు
భగ్గుమని మండుచుండె మా బాపుగుండె!!

చేతికఱ్ఱ వీడి చెప్పులు విడనాడి
కదలిపోయినాఁడు గాంధితాత!
'ఎగుడు దిగుడు' లేని హెచ్చుతగ్గులు' లేని
'తేళ్ళు ముళ్ళు లేని దేశమునకు -.

ప్రాకృతీ స్వర్ణగర్భాన ప్రభవమంది,
తమ్ములను లేపి, నూత్న చైతన్య మొసఁగి
ధ్వాంత మెడబాపి, స్వాతంత్ర్య కాంతు లిడిన
'భువనబంధుఁడు' పశ్చిమాంభోధిఁ గ్రుంకె.

బ్రతికి పేరు ప్రతిష్ఠలు వడయలేక
చచ్చి గొప్పవా రగుదురు చాలమంది;
బ్రతికియుం జచ్చియును ఈ
ప్రపంచమందు
మూడు కాలమ్ములకు మహాత్ముఁడవు
నీవు!!

**గాంధీ జయంతి**
**సందర్భంగా**

# అఖిల భారత కాంగ్రెస్ తాత్కాలిక అధ్యక్షులు "శ్రీ సీతారాం కేసరి"



అనేక అవినీతి ఆరోపణల ఫలితంగా అఖిల భారత కాంగ్రెసు పార్టీ అధ్యక్ష స్థానం నుండి శ్రీ పాములపర్తి వెంకట నరసింహా రావు తప్పుకోవలసి వచ్చింది. తత్ఫలితంగా 23.9.1996వ తేదీన శ్రీ సీతారాం కేసరి తాత్కాలిక అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

గాంధీ గారి తర్వాత జాతీయ పక్షమైన కాంగ్రెసు పార్టీ అధ్యక్ష స్థానం తొలిసారిగా వైశ్యులకు లభించింది.

సీతారాం కేసరి బనియా వైశ్యుడు. "లార్డ్ మర్ఫి", "లార్డ్ డెంట్" అను ఈ ఇద్దరూ ప్రసిద్ధ ఆంగ్ల పరిశోధకులు. భారతీయ వైశ్యులకు సంబంధించి 1800 శాఖలతో ఒక సూచికను వీరు తయారు చేశారు. ఆ శాఖల్లో ప్రధానమైనవీ, ఇప్పటికీ ఉన్నవి 83 మాత్రమే. ఆ శాఖల్లో ఒక శాఖ "బనియ".

కేసరికి వయస్సు 77 సంవత్సరాలు. బీహారు రాష్ట్రంవాడు. కాంగ్రెసు పార్టీ సేవాదళ్‌లో అతి సామాన్య కార్యకర్తగా కేసరి రాజకీయ జీవితం ప్రారంభమైంది. అదే పార్టీలోనే ఆయన ఇప్పుడు అత్యున్నత స్థానాన్ని అలంకరించారు.

కాంగ్రెసు పార్టీ కోశాధికారిగా కేసరి 1979 నుండి నిరాటంకంగా బాధ్యతలు నిర్వహించాడు. కాంగ్రెసు వంటి పెద్ద రాజకీయ పక్షానికి ఏకంగా 17 సంవత్సరాలు కోశాధికారి బాధ్యతలు నిర్వహించడమంటే సామాన్యమైన విషయం కాదు. ఆయన అంత పెద్ద పదవిని నిర్వహిస్తున్నా సామాన్యుడుగా నిరాడంబరంగా జీవితాన్ని సాగించాడు. సాధుజీవనుడు కేసరి. కోట్లాది రూపాయలను తన చేతుల మీదుగా సేకరించినా, తన చేతుల మీదుగానే పంపిణీ జరిగినా ఒక్క పైసా కూడ తన సొంతానికి వినియోగించని నిజాయితీ పరుడు. అర్థ బలాన్ని సేకరించడములో కేసరి, దిట్ట. 1979 నుండీ కోశాధికారిగా బాధ్యతలు నిర్వహిస్తూండినా పార్టీకి నిధులు ఎక్కడ నుండి వస్తున్నాయో? ఆర్థిక సహాయాన్ని అందిస్తున్న వాణిజ్య

వేత్తలు ఎవరు? పరిశ్రమాధిపతులు ఎవ్వరు? అనే వివరాలను కేసరి ఏనాడూ బయటికి తెలియనీయలేదు. ఎవరిని, ఎక్కడ, ఎప్పుడు సంప్రదించి పార్టీకి నిధులు తెస్తున్నదీ మూడో కంటికి తెలియనీయ లేదు కేసరి. గప్‌చిప్‌గా, అతి గడుసుగా అర్థ బలాన్ని సాధించాడు. పార్టీకి అందిన నిధులలో వేటికీ రికార్డులూ, డాక్యుమెంట్లూ ఉండవు. నిధుల విషయములో కోశాధికారి చెప్పిందే వేదం.

క్లుప్తంగా - సున్నితంగా మాట్లాడే నైజం కేసరిది. ముగ్గురు ప్రధాన మంత్రులు ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీ, పి.వి. నరసింహారావు గారల హయాంలో కోశాధికారిగా కొనసాగిన ఘనత కేసరికే దక్కింది. కేసరి కోశాధికారిగా కొనసాగిన కాలములో నాలుగు సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. ఆ నాలుగు ఎన్నికలలోనూ కాంగ్రెసు పార్టీ అభ్యర్థులుగా నిలబడిన వారి అవసరాలను 'గుంభనంగా' తీర్చిన ఘనతను కేసరి దక్కించు కొన్నాడు.

సీతారాం కేసరి తన రాజకీయ జీవిత కాలములో ఒక్కసారి మాత్రమే లోకసభకు ఎన్నికయ్యారు. మొట్టమొదటి సారిగా 1967లో - బీహారు రాష్ట్రానికి చెందిన కతిహార్ లోకసభా స్థానము నుండీ కాంగ్రెసు పార్టీ అభ్యర్థిగా పోటీచేసి లోకసభ సభ్యులుగా ఎన్నికయ్యారు. ఆ తరువాత 1971 నుండీ రాజ్యసభ సభ్యులుగానే కొనసాగుచున్నారు.

కేసరిని అందరూ ఆప్యాయంగా 'చాచా' అని పిలుస్తారు.

కేసరి శుద్ధ గాంధేయవాది. గాంధీజీ పిలుపుతో ఉప్పు సత్యాగ్రహములో పాల్గొని 1930-42 మధ్య కాలములో పలుసార్లు జైలుశిక్షను అనుభవించాడు. ఆయన జైల్లో ఉన్న సమయములో తండ్రి మరణించాడు. తండ్రికి కర్మకాండను నిర్వహించుటకు గాను పెరోల్‌పై విడుదల చేస్తామని అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం చెప్పినా, ఆయన తిరస్కరించాడు. అంతటి దేశభక్తుడు కేసరి.

1964లో బీహారు ప్రదేశ్ రాష్ట్ర కాంగ్రెసు పార్టీకి కార్య నిర్వాహక కార్యదర్శిగా ఎన్నిక కావడముతో ఆయన రాజకీయ జీవితం మలుపు తిరిగింది. 1973-77 మధ్యలో ఆయన బీహారు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగా వ్యవహరించారు. రాజ్యసభ సభ్యులుగా కేసరి కేంద్రములోని నేతలందరికీ బాగా సన్నిహితులయ్యారు. నిజాయితీ, చిత్తశుద్ధిగల వారిని పదవులు వాటంతట అవే వెదుక్కుంటూ వస్తాయి. నాలుగు పర్యాయాలు కేంద్రమంత్రిగా పనిచేశారు. కీలకమైన పార్లమెంటరీ శాఖను కూడా వీరు నిర్వహించారు.

పార్టీ రాజకీయాల్లో సీతారాం కేసరి చాలా చురుగ్గా పాల్గొనే వాడు. ఇందిరా గాంధీ తన హయాములో కాంగ్రెసు పాలనలోని ముఖ్యమంత్రులను మార్చే సమయములో కేసరినే పలుసార్లు పరిశీలకుడి హోదాలో ఆయా రాష్ట్రాలకు పంపింది. రాజీవ్ గాంధీ హయాములో

వైశ్యప్రబోధిని, అక్టోబరు 1996

కూడ పలు రాష్ట్ర శాఖల్లో తలెత్తిన సంక్షోభాలను పరిష్కరించే బాధ్యతను కూడ కేసరి నిర్వహించాడు. విశ్వనాథ ప్రతాప్‌సింగ్ మండల నినాదం-పార్లమెంటుని ఇరుకున పెట్టినపుడు, కాంగ్రెసు విధాన నిర్ణయ సూత్రధారిగా కీలక పాత్రను పోషించాడు కేసరి. మండల్ నివేదికకు అనుకూలంగా అనేక సార్లు కాంగ్రెసు వర్కింగ్ కమిటి సమావేశాల్లో "వెనుకబడిన వర్గాల ఆదరణను కాంగ్రెసు పార్టీ చూరగొనడానికి మండల్ సిఫారసులను ఆమోదించడం తప్పనిసరి" అని గట్టిగా వాదించి పార్టీ నేతలను ఒప్పించింది వీరే. మైనారిటీలూ వెనుకబడిన వర్గాలూ కాంగ్రెసు పక్షములో నిలిచేటట్లు చేయుటకు కూడ కేసరి వ్యూహరచన చేశాడు. కేంద్ర సంక్షేమశాఖామాత్యులుగా ముస్లీముల రిజర్వేషనుకు అనుకూలంగా కేసరి చేసిన వ్యాఖ్యలు వివాదాస్పదాలయ్యాయి.

కాంగ్రెసు పార్టీ అధ్యక్ష స్థానానికి తిరిగి ఎన్నికలు జరిగేంత వరకు కేసరి అఖిల భారత కాంగ్రెసు పార్టీ అధ్యక్షులుగా కొనసాగుతారు. సచ్ఛీలత, సాదు జీవనము, నీతి - నిజాయితీ, సహృదయత, స్నేహ శీలత గల వారు పదవిలో ఉండడం వల్ల పదవిలో ఉన్న వ్యక్తి కన్నా ఆ పదవికే వన్నె మిక్కిలిగా వస్తుంది.

యాదృచ్ఛికమే అయినా అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ సీతారాం కేసరి, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ కొంజేటి రోశయ్య ఇరువురూ వైశ్యులు కావడం విశేషం.

## జగదీశ్వరయ్య అవార్డు ప్రదానం

ప్రతి ఏటా ఇస్తున్న స్వర్గీయ శ్రీ తేరాల జగదీశ్వరయ్య గుప్త అవార్డును ఈ సంవత్సరం వైశ్యభూమి పత్రికా సంపాదకులు శ్రీ పెరుమాళ్ళ అప్పారావు గారికి 17.9.1996వ తేదీన 'విద్యారత్న' శ్రీ చల్లా సోమరాజ్‌రామ్ గారు బహూకరించి సన్మానించారు.

## ఒక్క క్షణం

**ఇప్పుడు అమలులో ఉన్న అమ్మకం పన్ను చట్టాన్ని సవరిస్తూ మన రాష్ట్ర ప్రభుత్వం ఆర్డినెన్సును విడుదల చేసిన విషయమూ, ఆ తరువాత ఆ ఆర్డినెన్సులో అనేక మినహాయింపులు ముఖ్యమంత్రి ఇచ్చిన విషయమూ మీకు తెలుసు. సమగ్ర విషయం అందుటలో జరుగుచున్న జాప్యంవల్ల ఆ వివరాలను ప్రచురించలేక పోతున్నాము.**

**- సంపాదకులు**

# 'అవచి' ధర్మనిష్ఠ

(గత సంచిక తరువాయి)

మల్లారెడ్డి, విస్సన మంత్రి అవచి మాటలు . వింటున్నారు. స్వప్న ప్రపంచములో విహరిస్తున్నట్లుగా వారు భావిస్తున్నారు.

అవచి తిరిగి తన మాటలను కొన సాగించాడు.

మల్లారెడ్డీ! ఇది సాధ్యమా! అని - ఆలోచిస్తున్నావు కదూ! సంకల్పబలం ఉంటే సాధించరానిదేదీ ఉండదు. మనము చేపట్టనున్న కార్యము ధర్మ సమన్వితము. ధర్మ దేవత మన పక్షాన ఉన్నది. తప్పక విజయం సమకూర్చుతుంది. కావలసింది పురుష ప్రయత్నములో లోపము లేకుండా చేయుటయే

మల్లారెడ్డి వింటున్నాడు. ఆయన ఆలోచిస్తున్నట్లుగా అవచి గ్రహించాడు.

మల్లారెడ్డీ! మీ ఆలోచన నాకు అవగత మైంది. మీకు మోటుపల్లి చుట్టు ప్రక్కల గల భూభాగము మాత్రమే పరిచితము. సముద్ర తీరమును గురించి మీకు పరిచయము లేదు. అందువల్ల నౌకలు గట్టు చేరుటకు అనుకూలములగు తావులు కానీ, అవి దాగి ఉండుటకు అవకాశం గల ప్రదేశాలు కానీ, మీకు తెలియవు. మీరు ఆలోచిస్తున్నది - ఈ విషయాలను గురించే ననుకుంటా - అవచి అడిగాడు.

శ్రేష్ఠీ! మీరు సర్వజ్ఞులు. దేశభక్తిలో, మీకు మీరే సాటి. మా ఆలోచనను చక్కగా గ్రహించారు. ఆ విషయాలు గల పటమునొక దానిని వ్రాయించి పంపింపుడు. అది మాకు చాలా సహాయముగా ఉండగలదు.

రత్నగేహి వద్దగల రెండు పటాలను తీసుకొని అవచి మల్లారెడ్డికి - ఇచ్చాడు.

మల్లారెడ్డి, విస్సన మంత్రి ఆపటాలను విప్పి చూశారు. వాటిలో ఒకటి వారికి తెలిసిన భూభాగము గల పటము. రెండవది తీరపటము. వారికి కావలసిన విషయమంతా అందులో ఉంది. ఆ యిద్దరూ వాటిని పరిశీలిస్తున్నారు.

ఆ పటాలలో మీకు కావలసిన విషయాలు ఎన్ని ఉన్నా, ఇంకా తెలుసు కోవలసిన విషయాలు ఉన్నవి. అయినా ఆ పటాలలోని విషయాలను బాగా గ్రహించి మీ హృదయాలలో పదిల పరచుకోండి. ఆ పటాలను చూచినంత మాత్రాన్నే సాగర విశేషాలు, నౌకల రహస్యాలు, గాలి పోకడలు మీకు అంత సులువుగా అవగాహనకావు. అందుకు కొంత అనుభవం గల వారి సహాయ మవసరం, కమలనాభామాత్యుని, రత్నగేహిని ఇక్కడే కొంతకాలం ఉంచుతాను. మీకు తెలియని విషయాలను వీరినడిగి మీరు తెలుసుకోవచ్చు - అన్నాడు అవచి.

శ్రేష్ఠీ! మేము చాలా అదృష్టవంతులం. కాబట్టే మీ అనుగ్రహానికి పాత్రుల మయ్యాము. మాలోని ఉత్సాహం కట్టలు త్రెంచుకొని పొంగి వస్తూ ఉంది. ఈ ప్రాంతాలలో చెంచుల అలజడి ఎక్కువగా

# రెడ్డి రాజుల కాలంనాటి ఆంధ్రప్రదేశం




ఉంది. ప్రజలను వారు బాధిస్తున్నారు. వారిని శిక్షించి మోటుపల్లిని పట్టు కొనుటకు ప్రయత్నం చేస్తాము - మల్లారెడ్డి.

ఆ మాటలు అవచిని ఆనంద పరచాయి. చెంచులు ఆయన పట కుటీరాలపై బాణాలు వేయుటనూ, వారిని ఆయన శిక్షించుటనూ, హెచ్చరించుటనూ మల్లారెడ్డికి వినిపించాడు. తనకు చిక్కిన ఆయుర్వురు చెంచులను తానా ప్రాంతాన్ని వదలి వెళ్ళుటకులోగా మల్లారెడ్డికి అప్ప గిస్తానని పలికాడు.

ఆ రాత్రికి మల్లారెడ్డి ఇచ్చిన ఆతిథ్యాన్ని అవచి స్వీకరించాడు.

మల్లారెడ్డి చెంచులను కఠినంగా శిక్షించి, తన అదుపులోకి తీసుకున్నాడు.

తన అన్న ప్రోలయ వేమారెడ్డి వద్దకు వెళ్ళి, అవచి అనుగ్రహించిన విధమునూ - అందించనున్న సహాయాన్నీ వివరించి - మోటుపల్లిని పట్టుకొనుటకు అనుజ్ఞను పొందాడు.

మోటుపల్లి కృష్ణాజిల్లాకు చెందినది. తూర్పు తీరములో - నెల్లూరుకు -.మచిలీ పట్టణానికీ ఇంచుమించు సమాన దూరములో ఉన్న ముఖ్య రేవు పట్టణము (చూడు పైపటము).

శిశిరం వచ్చింది. కృష్ణలో ప్రవాహవేగం తగ్గింది. అప్పుడప్పుడు పాటు వస్తూనే ఉంది. అయితే ఆ పాటు అంత ప్రమాదకరంగా లేదు.

ఒక శుభ ముహూర్తాన - మల్లారెడ్డి ధరణికోట వద్ద నౌకలను ఎక్కి కృష్ణానది ముఖ ద్వారానికి చేరుకొన్నాడు. ఆయనతో విస్సన మంత్రి, రత్నగేహి, కమలనాభా మాత్యుడు, సైన్యమూ ఉంది.

అవీ మల్లారెడ్డికి ఇచ్చిన ఆరునెలల గడువు కూడ పూర్తి కావచ్చింది.

వీర విక్రమముతో మల్లారెడ్డి - యుద్ధభేరిని మ్రోగించాడు. కమలనాభా మాత్యుడు, సూచనలు, సలహాలు ఇస్తూ ఉన్నారు.

ఢిల్లీ పాదుషాల ప్రతినిధిగా ఉన్న అల్లా ఉద్దీన్ ఆ కోటను రక్షిస్తున్నాడు.

యుద్ధం సాగుచూ ఉంది.

మల్లారెడ్డి జల - భూమార్గాలను దిగ్బంధనం చేశాడు. అల్లా ఉద్దీన్‌కు ఎటువంటి సహకారము అందలేదు. చివరకు భటులకు జీతములు కూడ ఇవ్వలేని పరిస్థితి ఆతనికి దాపురించింది. అప్పటి తన స్థితినీ, అంతవరకూ సాగిన యుద్ధ క్రమమునూ పరిశీలించాడు.

కోటసగము శత్రువుల వశమైంది. కోటను పూర్తిగా వశము చేసుకొను ప్రయత్నములో ఉన్నాడు మల్లారెడ్డి.

ఒక మహానౌకలో అవచి అక్కడికి చేరుకొన్నాడు. ఆయన వెంట మరికొన్ని మహానౌకలు, నౌకలు కూడ - వచ్చాయి.

ఆనాటికి యుద్ధము ముగిసింది. మల్లారెడ్డి, విస్సన మంత్రి, మరికొందరితో కలిసి శ్రేష్ఠికి వద్ద వెళ్ళాడు. శ్రేష్ఠి ఎక్కి వచ్చిన ఆ మహానౌకను తిలకించాడు. విభ్రాంతుడయ్యాడు. ఇది నౌకయేనా? లేక మహారాజ సౌధమా! అను విచికిత్సలో పడ్డాడు.

మల్లారెడ్డి రాకను గమనించిన దేవారికుడు ఆయన రాకను శ్రేష్ఠికి యెఱిగించి ఆయన అనుమతితో మల్లారెడ్డిని శ్రేష్ఠి సన్నిధికి తీసుక వెళ్ళాడు.

ఆ నౌకలోని సభాభవనములో - అవచి, పట్టు పరుపులు మీద ఆసీనుడై ఉన్నాడు. సౌందర్యవంతులైన ఇరువురు స్త్రీలు ఆయన కిరువైపులా నిలిచి, వింజామరలు వీస్తున్నారు. ఆ సభా భవనము మహా సుందరంగా ఉంది. ఆ నిర్మాణము, అలంకరణా విధానము అవచి తిప్పయలోని కళాభిరుచిని అద్దం పట్టి చూపిస్తూంది. ఆ సభా మందిరం లోపలి పైభాగాన చీనాంబరాలు కట్టబడి ఉన్నాయి. నలు ప్రక్కలా చిత్ర, విచిత్ర వర్ణములు గల పటాలు వ్రేలాడు చున్నాయి. వంది - మాగధులు కైవారాలు చేస్తూన్నారు. నర్తకి మంగళ హారతులు ఇస్తూ ఉంది. మంత్రులు, దళపతులు ఆయన్ను పరివేష్టించి ఉన్నారు. ఆ సభ ఇంద్రసభను తలపిస్తూ ఉంది.

మల్లారెడ్డి ముందు రాత్రి జరిగిన యుద్ధ విశేషాలను అవచికి వినిపించాడు. మోటుపల్లి రేవు మన వశమైంది. అంటే దుర్గము యొక్క ప్రాణములో సగం మనం చేజిక్కించుకొన్నాము అనికూడ ఆయనతో మల్లారెడ్డి చెప్పాడు. అవచి ఆనందానికి

ఎల్లలు లేవు. నౌకా యుద్ధము సరిక్రొత్తదైనా అందులో అద్భుత నైపుణ్యాన్నీ, శౌర్యాన్నీ చూపించిన మల్లారెడ్డిని ఆ శ్రేష్ఠివర్యుడు మరీ మరీ శ్లాఘించాడు.

అపాయములేని ఉపాయముతో ఆశించిన ఫలితాన్ని పొందేందుకు అన్ని విధాలా ప్రయత్నించిన పిదపనే సాహస పనులకు ఉపక్రమించాలి. ఒకనాడు భూమార్గాన, మరొక్కనాడు జల మార్గానా యుద్ధము చేయాలి. ఇందువల్ల సైనికులకు విశ్రాంతి లభిస్తుంది అని అవచి మల్లారెడ్డికి సలహా ఇచ్చాడు.

అవచిదేవయ నౌకలు సప్త సముద్రాల్లోనూ తిరుగుతూ ఉంటాయి. అందువల్ల ఆయనకు అనేక దేశాలలో గల దుర్గాలను సాధించుట కనువైన - మార్గాలు తెలుసు. దుర్గాలను సాధించుటకు అవసరమైన సాధనాలను నిర్మించుటలో నేర్పరులైన శిలాశిల్పులు, స్థపతులు అవచి సైనికులలో ఉన్నారు. వాటన్నింటిని శ్రేష్ఠి మల్లారెడ్డికి వివరించాడు.

యుద్ధ సమయములో శత్రువులు శిలలు ప్రయోగిస్తూ నౌకలను ముంచుతూ ఉన్నారు. ఆ శిలా ప్రయోగ విధానము తెలిసిన వారు రెడ్డి సైన్యములో లేరు. మల్లారెడ్డితో వచ్చిన తోకరాజు సైన్యములో పంచభిక్షము, రామలింగము అను ఇద్దరు సోదరులు ఉన్నారు. వీరు శ్రీశైల ప్రాంతవాసులు. శత్రువుల వైపునుండీ వచ్చు శిలా ప్రయోగాన్ని ఈ సోదరులు గమనించారు. అవి యంత్ర సహాయముతో విసరివేయబడినట్లుగా గుర్తించాడు రామలింగం. అటువంటి యంత్రాన్ని తయారు చేయుటకు ప్రయత్నిస్తున్నాడు. ఏ విధంగా నిర్మించినా ఏదో ఒక లోపము కన్పిస్తూనే ఉంది. రామలింగము ఆ లోపాల్ని తెలుసుకోలేక పోతున్నాడు. ఈ విషయం అవచికి తెలిసింది. రామలింగాన్ని పిలిపించి ఇది అంత పెద్ద కష్టమైంది కాదు. అంతకన్నా గురిగా వేయవచ్చు. అని పలికి రత్నగేహివైపు చూచాడు.

రత్నగేహి ఆ యంత్ర నిర్మాణ విధానాన్ని రామలింగానికి వివరించాడు. రామలింగని ప్రయోగం ఫలించింది. తన యంత్ర సహాయముతో రామలింగడు ఎదుటి పక్షముపై శిలలు విసరి శత్రు నౌకలను ముంచి వేశాడు.

అవచిదేవయ కేవలం సలహాలకే పరిమితం కాలేదు. సముద్రము వైపు నుండీ కోటపైకి విజృంభించు బాధ్యతను తీసుకొన్నాడు. మరో వైపునుండీ కోటపైకి సైనికులతో విజృంభించమని మల్లారెడ్డికి చెప్పాడు.

యుద్ధములో అవచిదేవయ అగ్రభాగాన నిలిచి, సైన్యాన్ని నడిపించాడు. ఒక వైపున కమలనాభా మాత్యుడు. మరొక వైపున రత్నగేహి - అవచికి తోడుగా నడచారు.

యుద్ధము పదిరోజులు సాగింది. ఈ పదిరోజులూ, సముద్రము మీద నుండీ అవచి దేవయ, భూ మార్గము నుండీ మల్లారెడ్డి యుద్ధము సాగించారు.

పదకొండవరోజున జయ, జయ నినాదాలతో మల్లారెడ్డి సేనలతో కోటను ముట్టడించాడు.

అవచిదేవయ ఉదయాన్నే - ఏ కామ్రనాదునికి. వరద రాజస్వామికీ తన పురోహితులతో ప్రతిదినము వలెనే పూజలు చెయించాడు. వారిచ్చిన తీర్థ ప్రసాదాలను స్వీకరించాడు.

ఈనాడు మనము అనుసరించనున్న యుద్ధ విధానము సరిక్రొత్తది. మా నౌకయే ముందుభాగాన ఉంటుంది. మాకు కుడివైపున రత్తగేహి ఉంటారు. ఒక్క గడియలో మన నౌకలన్నీ బయలు దేరాలి - అని అవచిదేవయ - జయ! ఏకాంబ రేశ్వరా! జయ వరదరాజా! అను మాటలను ఉచ్చేస్వరముతో - పలికి సైనికులను ఉత్సాహ పరచాడు.

భూ మార్గము నుండీ మల్లారెడ్డి సైనికులు కోటపైకి లంఘిస్తున్నారు.

జల మార్గము నుండీ అవచి తన ఓడలలోని సైనికులను కోటపైకి చేర్చుచున్నారు.

యుద్ధము అతి భయంకరంగా సాగింది.

కోట తూర్పు గోడను అవచి సైనికులు పూర్తిగా స్వాధీనము చేసుకొన్నారు.

ఇక, కోట ఉత్తర, దక్షిణ భాగాలను స్వాధీనం చేసుకోవాల్సి ఉంది. అది అంత సులభంగా కన్పించుట లేదు.

అవచి ఒక ఎత్తు వేశాడు.

కోటలో యుద్ధము చేసే వీరులారా! వినండి. కోట స్వాధీన మైంది. మీరు ఇంకా ఎదిరించి నిలుచుట వృధా. ఆయుధాలు పారవేసి, చేతులు కట్టుకొని నిలబడండి.

మీ ప్రాణాలకు మేము రక్షణ ఇస్తున్నాం. ఇది మల్లారెడ్డి, అవచి దేవయ ప్రభువుల అభయం - అంటూ ప్రకటింప జేశాడు అవచి.

ఆ ప్రకటనను విని కోటలోని సైనికులు తమ ఆయుధాలను విడిచి లొంగి పోయారు.

అల్లా ఉద్దీన్ పోరాడుటకే నిర్ణయించుకొని కొంతసేపు పోరాడాడు.

అవచిదేవయ ఇచ్చిన ఖడ్గాన్ని ధరించి, ఎదురునిలచి, పోరాడుచున్న మల్లారెడ్డి ప్రతాపం ముందు అల్లా ఉద్దీన్ నిలువలేక పోయాడు. మల్లారెడ్డి అతన్ని బంధించాడు.

మోటుపల్లి రేవు, దుర్గము రెండూ మల్లారెడ్డి వశమయ్యాయి.

విజయానికి గుర్తుగా మల్లారెడ్డి అవచి దేవయ చేత పతాకాన్ని ఎగుర వేయించాడు.

అవచి తన వెంట వచ్చిన పలువురు వైద్యులతో ఆ యుద్ధమున గాయపడిన వారందరికీ అవసరమైన చికిత్సలు చేయించాడు.

అల్లా ఉద్దీన్ జన్మతః బ్రాహ్మణుడు. విద్వత్ కుటుంబములో జన్మించినవాడు. యవనుల కొలువులో చేరి మతాన్ని మార్చుకొని అల్లా ఉద్దీన్ అను పేరు పెట్టుకొన్నాడు. యవనులలో కలసిన ఆయన ఎన్నో దుష్కృత్యాలు చేశాడు. ప్రజలను పలు రకాలుగా బాధించాడు. అవచిదేవయ ముందు ఆయనపై విచారణ జరిగింది. అమృత మూర్తీ, కరుణారస హృదయుడూ అయిన ఆ శ్రేష్ఠి

అల్లా ఉద్దీన్‌కు క్షమాబిక్షను ప్రసాదించమని మల్లారెడ్డికి చెప్పాడు.

మోటుపల్లి రక్షణకు అవసరమైన అన్ని విధాల ఏర్పాట్లనూ మల్లారెడ్డి చేశాడు.

తన అన్న వేమారెడ్డిని దర్శించుటకు అద్దంకికి బయలు దేరాడు మల్లారెడ్డి.

అద్దంకి వేమారెడ్డి రాజధాని - ఇది ఇప్పటి ప్రకాశం జిల్లాలో ఉంది.

అవచిదేవయ తిప్ప కూడ ఆయన వెంట అద్దంకికి ప్రయాణమయ్యాడు.

జరీదైన పట్టు పీతాంబరాలనూ అమూల్య రత్న హారాలనూ - తనకు గల గౌరవ చిహ్నాలనూ ధరించి, మద గజమును అధిరోహించి, అవచి సాగిపోతున్నాడు. వంది మాగధులు కైవారాలు చేస్తూ బిరుద గద్యలు చదువుచూ ఉన్నారు. అత్యంత ఆడంబరంగా, మహారీవిగా వెళ్ళుచున్న ఆ శ్రేష్ఠిని పరవేష్టించి కొందరు భటులూ వెళ్ళుచున్నారు. ఆ పరివారములో కమలనాభా మాత్యుడూ, రత్నగేహీ ఉన్నారు.

మూడవ నాటికి వారంతా - 'అద్దంకి' ని చేరుకొన్నారు.

వేమారెడ్డి, ఆయన సోదరులు - వీర విక్రమ శౌర్య పటిమలతో - తూర్పు తీరమునుండీ పశ్చిమాన అహోభిలం వరకూ, ఉత్తరాన కృష్ణా తీరమునుండి దక్షిణాన పెన్నా తీరము వరకూ గల మధ్య ఆంధ్ర భూమి పూర్తిగా యవనుల ఆధిపత్యము నుండీ తప్పించుకొని స్వతంత్రమైంధి.

అప్పటికి వసంత ఋతువు వచ్చింది. చెట్లు చిగిరించాయి. ప్రకృతి సరిక్రొత్త దుస్తుల్లో ఆనందాన్ని కలిగిస్తోంది.

ఆ ఏడు - విజయోత్సవముతో కలిసి వసంతోత్సవమూ జరిగింది.

ఆనాటి ఆ విజయోత్సవ సభకు అవచి దేవయ శ్రేష్ఠి ప్రధాన అతిది. ప్రత్యేక ఆకర్షణ.

వేమారెడ్డి శ్రేష్ఠికి వందన శతము లర్పించాడు.

శ్రేష్ఠిదేవా! ఆంధ్ర భూమిని యవనుల చెఱనుండీ విడిపించుటకై జరిగిన సంగరములో మాకు మీరు చేసిన సహాయం సాటిలేనిది. ఇందులకు మేము సర్వదా కృతజ్ఞులము. మీ ఔదార్యాన్నీ, మీ త్యాగనిరతినీ పొగడుటకు మాకు శక్తి చాలదు. మీ దేశభక్తి అనుపమానము. తమరు మాకు యుద్ధారంబమునకు పూర్వము ఇచ్చిన రణ సాధనాలలో నష్టమైన వాటికి మూల్యము తీసుకోము అనీ, మిగిలిన వాటిని మాత్రమే తీసుకొంటాము అనీ మాట ఇచ్చారు. ఒకవేళ, మిగిలిన రణ సాధనములను మేము తిరిగి మీకు ఇచ్చుటకు ఇష్టపడనిచో వాటికగు మూల్యమును తీసికొని తృప్తి జెందుతామని కూడ ఆ రోజు మీరు మాకు చెప్పియున్నారు. ఆ ప్రకారము యుద్ధానంతరము మిగిలిన రణ సాధనముల విలువలను మా వ్రాయస గాండ్రకు చెప్పి లెక్కలు కట్టించాము. మా వారు కట్టిన లెక్కల ప్రకారము మిగిలిన గుఱ్ఱములు, గజములు, శూలములు, కుంతలములు మొదలగు రణ సాధనాల - ఆహార పదార్థాల విలువ కోటి సువర్ణాలు. ఈ

విలువలు సరిగా ఉన్నవో! లేవో! మీరున్నా ఒకసారి చూచి నిర్ణయించండి. మీరు ఆనాడు - మాకు ఇచ్చిన రణ సాధనాల కన్నా మూడింతలుగా మాకు శత్రువుల నుండీ లభించాయి. అందువలన మీరు మాకిచ్చిన వాటిలో నష్టపడిన వాటికి కూడ - మూల్యము చెల్లించు కోవడము ధర్మమని మేము భావించాము. ఇవిగో ఆ లెక్కలు. వీటి విలువ కూడ కోటి సువర్ణములని తేలింది. ఈ రెండు కోట్ల సువర్ణాలను తమకు అర్పించుటకు మా మంత్రులు సిద్ధముగా ఉన్నారు. వీటిని స్వీకరించి మమ్ములను ఋణ విముక్తులుగా చేయండి - అని ఆ సభలో వేమారెడ్డి శ్రేష్ఠికి విన్నవించుకొన్నాడు.

మంత్రి రామయ ప్రెగ్గడ ఆ పత్రాలను అవచిదేవయ కరకమలములలో ఉంచాడు.

శ్రేష్ఠి ఆ పత్రాల వైపు చూడలేదు. చిరునవ్వులతో ధీరగంభీరంగా!

వేమభూవరా! ఈ కార్యమునకు ప్రారంభమున మీతో మేము అప్రకారమూ ఒప్పందము చేసుకొన్నది నిజమే. ఈ యుద్ధ మనే ఈ యజ్ఞాన్ని మీరు ఎంతో సమర్థతతో నిర్వహించారు. మా ఆశయాన్ని సఫలీకృతం చేశారు. నష్టపడిన వాటికి కానీ, మిగిలియున్న వాటికి కానీ మేము మీ నుండీ ఏ విధమగు మూల్యమునూ తీసుకోము. ఈ రెండు కోట్ల సువర్ణాలనూ ఈ విజయమునకు కానుకగా మీకు సమర్పించుకొంటున్నాము. స్వీకరింపుడు. మీరు ఋణ విముక్తులైతిరి. అని పలికి, అంతటితో ఆగక,

వేమ ప్రభూ! ఈ తీరభూమిని కాపాడు కొనుటకు మీకు పదునైదు మహానౌకలు కావాల్సి ఉండును. సుల్తాను వారినుండి మీరు పట్టుకొన్న పదునైదు నౌకలకు తోడుగా మా నౌకలలో పదునైదు నౌకలను మేము మీకు కాన్కగా ఇస్తున్నాము. నౌకా మర్మాలెరిగిన మల్లారెడ్డినీ, విస్సన మంత్రినీ పంపి మా నౌకలలో మీకు నచ్చిన వాటిని తీసుకొనుడు. అని కూడ అవచి పలికాడు.

శ్రేష్ఠి మాటలకు అక్కడ వారు నిర్ఘాంత పోయారు.

అవచిదేదయతిప్పశ్రేష్ఠి వితరణనూ ఆయనకు జన్మభూమి మీద గల అభిమానాన్నీ అనేక విధాలుగా కొనియాడారు.

వేమభూపాలుడు ఆ నౌకలను స్వీకరించాడు.

ఆ మహాసభా సమక్షములో మంత్రులతో సంప్రదించి "వశీకృత నిఖిల భూ భుజ సతత త్యాగధ్వజ" అను బిరుదును అవచి దేవయకు ఇచ్చి ఘనంగా సత్కరించాడు.

వేమ భూమీశుని ఆజ్ఞచే కమలనాభామాత్యుడు ఆ బిరుదును - మూడు సార్లు ఉచ్చైస్వరముతో ఆ మహాసభలో పలికాడు.

అనంతరము - కొన్ని రోజులకు ఆ బిరుదచిహ్నమగు - కనక ధ్వజమును ష్ఠికి పంపించాడు.

శ్రీ కావేరీ వల్లభ!
లోకస్తవనీయ! సర్వలోకాశ్రయ! ద
ర్వీకర భూషణ భక్త! సు
ధీకలిత వివేక! యవచి దేవయ తిప్పా
- శ్రీనాథుడు -హరవిలాసం

*(శ్రీ నోరి నరసింహశాస్త్రి గారి మల్లారెడ్డి - ఆధారంగా)*

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1996 అక్టోబరు 21 నుండీ 1996 నవంబరు 20 వరకు)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | | 27 | 3 | 10 | 17 |
| సోమవారము | 21 | 28 | 4 | 11 | 18 |
| మంగళవారము | 22 | 29 | 5 | 12 | 19 |
| బుధవారము | 23 | 30 | 6 | 13 | 20 |
| గురువారము | 24 | 31 | 7 | 14 | |
| శుక్రవారము | 25 | నవంబరు 1 | 8 | 15 | |
| శనివారము | 26 | 2 | 9 | 16 | |

అక్టోబరు 21 :- విజయదశమి - శమీదర్శనం. దుకాణాలు - సంస్థలు, కర్మాగారాలు - సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవు దినము.

అక్టోబరు 24 :- స్వాతి కార్తె రాక ఉ 8-14 గం.

విలువలు సరిగా ఉన్నవో! లేవో! మీరున్నూ ఒకసారి చూచి నిర్ణయించండి. మీరు ఆనాడు - మాకు ఇచ్చిన రణ సాధనాల కన్నా మూడింతలుగా మాకు శత్రువుల నుండీ లభించాయి. అందువలన మీరు మాకిచ్చిన వాటిలో నష్టపడిన వాటికి కూడ - మూల్యము చెల్లించు కోవడము ధర్మమని మేము భావించాము. ఇవిగో ఆ లెక్కలు. వీటి విలువ కూడ కోటి సువర్ణములని తేలింది. ఈ రెండు కోట్ల సువర్ణాలను తమకు అర్పించుటకు మా మంత్రులు సిద్ధముగా ఉన్నారు. వీటిని స్వీకరించి మమ్ములను ఋణ విముక్తులుగా చేయండి - అని ఆ సభలో వేమారెడ్డి శ్రేష్ఠికి విన్నవించుకొన్నాడు.

మంత్రి రామయ ప్రెగ్గడ ఆ పత్రాలను అవచిదేవయ కరకమలములలో ఉంచాడు.

శ్రేష్ఠి ఆ పత్రాల వైపు చూడలేదు. చిరునవ్వులతో ధీరగంభీరంగా!

వేమభూవరా! ఈ కార్యమునకు ప్రారంభమున మీతో మేము అప్రకారమూ ఒప్పందము చేసుకొన్నది నిజమే. ఈ యుద్ధ మనే ఈ యజ్ఞాన్ని మీరు ఎంతో సమర్థతతో నిర్వహించారు. మా ఆశయాన్ని సఫలీకృతం చేశారు. నష్టపడిన వాటికి కానీ, మిగిలియున్న వాటికి కానీ మేము మీ నుండీ ఏ విధమగు మూల్యమునూ తీసుకోము. ఈ రెండు కోట్ల సువర్ణాలనూ ఈ విజయమునకు కానుకగా మీకు సమర్పించుకొంటున్నాము. స్వీకరింపుడు. మీరు ఋణ విముక్తులైతిరి. అని పలికి, అంతటితో ఆగక,

వేమ ప్రభూ! ఈ తీరభూమిని కాపాడు కొనుటకు మీకు పదునైదు మహానౌకలు కావాల్సి ఉండును. సుల్తాను వారినుండీ మీరు పట్టుకొన్న పదునైదు నౌకలకు తోడుగా మా నౌకలలో పదునైదు నౌకలను మేము మీకు కాన్కగా ఇస్తున్నాము. నౌకా మర్మాలెరిగిన మల్లారెడ్డినీ, విస్సన మంత్రినీ పంపి మా నౌకలలో మీకు నచ్చిన వాటిని తీసుకొనుడు. అని కూడ అవచి పలికాడు.

శ్రేష్ఠి మాటలకు అక్కడ వారు నిర్ఘాంత పోయారు.

వితరణనూ ఆయనకు జన్మభూమి మీద గల అభి మానాన్నీ అనేక విధాలుగా కొనియాడారు.

వేమభూపాలుడు ఆ నౌకలను స్వీకరించాడు.

ఆ మహాసభా సమక్షములో మంత్రులతో సంప్రదించి "వశీకృత నిఖిల భూ భుజ సతత త్యాగధ్వజ" అను బిరుదును అవచి దేవయకు ఇచ్చి ఘనంగా సత్కరించాడు.

వేమ భూమీశుని ఆజ్ఞచే కమలనాభా మాత్యుడు ఆ బిరుదును - మూడు సార్లు ఉచ్చైస్స్వరముతో ఆ మహాసభలో పలికాడు.

అనంతరము - కొన్ని రోజులకు ఆ బిరుదచిహ్నమగు - కనక ధ్వజమును మల్లారెడ్డి శ్రేష్ఠికి పంపించాడు.

శ్రీ కావేరీ వల్లభ!<br>
లోకస్తవనీయ! సర్వలోకాశ్రయ! ద<br>
ర్వీకర భూషణ భక్త! సు<br>
ధీకలిత వివేక! యవచి దేవయ తిప్పా

— శ్రీనాధుడు - హరవిలాసం

(శ్రీ నోరి నరసింహశాస్త్రి గారి మల్లారెడ్డి - ఆధారంగా)

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1996 అక్టోబరు 21 నుండీ 1996 నవంబరు 20 వరకు)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | | 27 | 3 | 10 | 17 |
| సోమవారము | 21 | 28 | 4 | 11 | 18 |
| మంగళవారము | 22 | 29 | 5 | 12 | 19 |
| బుధవారము | 23 | 30 | 6 | 13 | 20 |
| గురువారము | 24 | 31 | 7 | 14 | |
| శుక్రవారము | 25 | నవంబరు 1 | 8 | 15 | |
| శనివారము | 26 | 2 | 9 | 16 | |

అక్టోబరు 21 :- విజయదశమి - శమీదర్శనం. దుకాణాలు - సంస్థలు, కర్మాగారాలు - సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవు దినము.

అక్టోబరు 24 :- స్వాతి కార్తె రాక ఉ 8-14 గం.

